శ్రీః

శంకర కృతము

# కనకధారాస్తవము

**జాతవేదావ్యాఖ్య**

అనువాదం

శ్రీమేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

విశ్రాంత సంస్కృత అధ్యాపకులు, తెనాలి



ప్రకాశకులు

సాధనగ్రంథమండలి

తెనాలి.



శ్రీః

శంకర కృతము

**కనకధారాస్తవము**

జాతవేదా వ్యాఖ్య - అనువాదం

శ్రీమేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

విశ్రాంత సంస్కృత అధ్యాపకులు, తెనాలి

Cell : 9908163627

ప్రథమ ముద్రణ : 27.02.2014 (మహాశివరాత్రి)

ప్రతులు : 500

పుటలు : 32

వెల రూ. : 20.00



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

D.T.P.:
**P.PARVATHI**
CELL: 7416586775

# పీఠిక

## "జాతవేదో మమావహ"

శంకర విరచితమయిన యీ స్తోత్రం లోక ప్రసిద్ధం. దీని ప్రసిద్ధనామం 'కనకధారాస్తవం'. శంకరులు బ్రహ్మచారిగా ఉన్న దశలో కౌమారవయస్సులో భిక్షాస్వీకారానికి ఒక పేద యింటికి వెళ్ళారు. ఆ యింటి యిల్లాలు ఇంట్లో ఏమీ లేక – ఒక ఉసిరికాయ దొరికితే అదే ఆయనకు భిక్షగా యిచ్చింది. శంకరులు ఆమె భక్తికి మెచ్చి, ఆమె అశక్తతకి నొచ్చి వారికి లక్ష్మీకటాక్షం కలిగించటానికి వెంటనే ఆశువుగా "హరివల్లభ"ను ఈ స్తవంతో స్తుతించారు. ఆ ప్రభావంతో ఆ యింట బంగారు 'ఉసిరికాయ'ల వర్షం కురిసిందట. అంతటితో ఆ యింటికి సౌభాగ్యం కలిగింది. అందువలననే దీనికి కనకధారాస్తవమని పేరు వచ్చినది. సువర్ణధారాస్తోత్రమని మరొక పేరున్నది. సువర్ణం అనగా, బంగారం, అక్షరాలు. అంటే సువర్ణములు అనగా మంచి రమణీయార్థం గల అక్షరములు. అట్టి రమణీయాక్షరధార ఇది అన్నది ప్రత్యక్ష విషయం. సువర్ణం అంటే మంచి వర్ణన అని అర్థము. ఈ కవితలో వర్ణనగూడా పుష్కలంగా ఉన్నది. మంచి వర్ణాలు, వర్ణనలు – ఏదో ఒకటి లేని శ్లోకం ఈ స్తుతిలో లేదు. హృదయంగమమయిన భావాలు చాలా ఉన్నాయి. అట్టి యీ సువర్ణధారాస్తోత్రం చదువరులకు సువర్ణధారలతో బాటు భక్తులకు కనకధారలు కురిపిస్తుందని ఆశ. కుబేరులను చేస్తుందని ఆశ. "ఆశ దురాశ నిరాశ" మనకు సహజం. 'సదాశ' తక్కువ. సదాశ లేనివారికి ఈ ఫలశ్రుతులు ఆశను, దురాశను, చివరకు నిరాశను కలిగిస్తాయి. ఎందుకంటే,

నేటివరకు ఎవరయినా యీ స్తోత్రపారాయణ ద్వారా కనకవర్షం కురిపించిందీ లేనిదీ మనకు తెలియదు. బంగారు ఉసిరివాన మనకు అనుభవంలో లేదు. అంత 'దృశ్య'ం లేక పోయినా యీ స్తోత్రపారాయణతో కుబేరులయిన వారెవరో మనకు తెలియదు. ఒకవేళ అయినామని ఎవరయినా చెప్పినా దానిచేతనే అయినారని నిరూపణ కావాలి.

సరే! అదట్లా ఉండనీయండి. అలా జరగకపోవటానికి మనం కారణాలు ఊహించాలి. అందులో

మొదటిది : మన "శ్రద్ధాలోపం భక్తిలోపం" – కాని యిన్ని వందల సంవత్సరాలలో ఒక్కరికయినా అంతటి భక్తి లేదనాలా? ఒక్క పేదవాడయినా నిండు భక్తితో చదవడా! లక్ష్మీదేవికి పక్షపాతమా? – అలా అనరాదుగదా! ఇక

రెండవది : రామబాణం వంటి సమాధానం. "ప్రారబ్ధం। గ్రహచారం। కర్మ" ఇందులో ప్రతిబంధకమయిన ప్రారబ్ధం పోవటమో, అనుకూల ప్రారబ్ధం రావటమో, లేక ప్రారబ్ధలేశం ఈ స్తోత్రం వలన నశించి వ్యక్తి బాగుపడటమో అవుతుంది. ఈ కారణానికి వేద శాస్త్రాలు పెట్టనికోటలు.

"హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి।
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే॥ అలాగే
"అవశ్యం భావి భావానాం – ప్రతీకారో భవేద్యది।
తథా దుఃఖైః న బాధ్యేరన్ – నలరామయుధిష్ఠిరాః॥

అయితే ప్రతిబంధకం తొలగడం ఎలా? ప్రతిబంధకం అనుభవంతో శాంతించి చివరిదశకు వచ్చినపుడుగాని, అసలు ప్రతిబంధక కర్మయే బలహీనమయినపుడు గాని యిట్టి స్తోత్రములు తీవ్రభక్తితో పారాయణ చేస్తే తొలగుతుందని శాస్త్రనిర్ణయం.

"పూర్వజన్మార్జితం కర్మ – వ్యాధిరూపేణ బాధతే।
తచ్ఛాంతిరౌషధైః దానైః – జపహోమసురార్చనైః॥

శ్రీవిద్యారణ్యస్వామి వారు మాధవనామంతో గృహస్థులై యుండగా పేదరికంతో బాధపడి లక్ష్మీ మంత్రారాధన చేసినట్లు, కాని దేవి ప్రారబ్ధ ప్రతిబంధము వలన సంపద నివ్వలేనని చెప్పినట్లు వదంతి. తర్వాత కాలక్రమంలో వారు సన్యసించారు. సన్యాసం మరోజన్మతో సమానం కనుక ఆయనకు శృంగగిరి పీఠాధిపత్యము మొదలగు అసంగరాజయోగం పట్టినది. అంటే తనకనుభవం లేదు. సన్యాసి గదా! కోరి రాజయోగం పట్టింది. ఈ కథ పెద్దల వలన విన్నాము. కనుక ఏదయినా కర్మఫలాన్ని బట్టే జరుగుతుంది.

మహాత్ములయినా ఆశ్రితుని కర్మ ఫలాన్నిబట్టి దాని బలహీనతను, సమాప్తి దశను గ్రహించి తమ మహిమతో ఆ ప్రారబ్ధలేశఖండనతో ఉపకారం చేస్తారు. దేవతలయినా అంతే. 'మూక' కవికి ప్రారబ్ధావసానాన్ని బట్టియే స్వామి కవితా శక్తినిప్పించారనక తప్పదు. లేదంటే శంకరులు చిరాయువయ్యేవారు. మార్కండేయుని ఆయుర్దాయం కోసం మృత్యు – మృత్యుంజయుల మధ్య అంత పోరాటం అవసరం లేదు. పరీక్షిత్తును బ్రతికించటానికి చక్రి 'గర్భం'లో కాపలా ఉండే అవసరం లేదు. ప్రారబ్ధం। గ్రహచారం బలవత్తరం.

అందువలననే కొందరికి ఏమి చేసినా ఏ ఉపకారం జరగదు. ఏ స్వాములవారు ఏమీ చెప్పరు, చేయరు. బలవత్తరమయిన కర్మఫలాన్ని ఎవరూ ఏమీ ఆపలేరు. సంచితాగామి కర్మలను క్షణంలో భస్మం చేయగలిగిన 'తత్త్వదర్శనం' కూడా ప్రారబ్ధాన్ని మాత్రం తప్పించదని శాస్త్రం ఘంటాపథంగా చెప్తున్నది. మరి యీ స్తోత్రాలు కర్మలు పెద్దల మహిమలు ఎలా ప్రారబ్ధాన్ని మార్చగలవు. అందువలన దేవతలయినా కర్మ ఫలం ఇవ్వడం తప్ప ఏమీ చేయలేరు.

"సర్వకర్మప్రవర్తినీ" , "సుఖప్రాణిశిరోరేఖా", సదదృష్టప్రదాయినీ" అన్నది లక్ష్మీసహస్రనామం. "తాం మ అవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్" అన్నది శ్రీసూక్తం. 'అగ్ని' దేవుడు 'శ్రీ'ని కలిగిస్తాడట. "అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ ", "హోతారం రత్నధాతమమ్", అన్నది శ్రుతి.

"శ్రియమిచ్ఛేత్ హుతాశనాత్" అని వాక్యము. అంటే అర్థం అగ్నిముఖులయిన దేవతలను అగ్నిద్వారా హవ్యకవ్యములతో సంతృప్తి పరిచిన వానికి లక్ష్మీప్రాప్తి. అనగా కర్మఫలమే సంపద. కర్మ, కర్మఫలవ్యవస్థలకు ప్రవర్తకురాలు శ్రీదేవియే.

"తామగ్నివర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం కర్మ ఫలేషు జుష్టామ్" – శ్రుతి.

ఈ వ్యవస్థ విషయంలో "మంత్రరహస్యం" అనే గ్రంథంలో ఇలా చెప్పబడినది.

"అత్యుత్కటైః పుణ్య పాపైః – ఇహైవ ఫలముచ్యతే ।
పుణ్యస్యానుత్కటత్వేతు – చిరాత్ కించిత్ఫలం లభేత్ ॥ అన్నారు.

అంతేకాక "ప్రతిబంధకబాహుళ్యే ఫలం జన్మాంతరే లభేత్" అన్నారు కనుక అతి తీవ్రంగా పారాయణం చేస్తే, ప్రారబ్ధం బలహీనం అయితే 'వాయిదా తీర్మానం' లాగా వెంటనే మన పారాయణం ఆ ప్రారబ్ధాన్ని వాయిదా వేయించి మరీ ఫలించవచ్చు. ఇలా అనుకొని చేయటం 'సదాశ', అట్టివారికి తరువాత జన్మలోనయిన ఫలితం ఉంటుందనే 'ఆశ' ఉంటుంది. వీరికి 'నిరాశ' ఉండదు. 'దురాశ'కు నిరాశ తప్పదు.

"న దేవతోషణం వ్యర్థం – భవిష్యతి కదాచన" – మంత్రరహస్యం. అయితే పైజన్మసంగతి మనకు తెలియదు గనుక వ్యర్థమయినట్లు భావిస్తాము.

అందుకే శంకరులు గూడా తమ స్తోత్రంలో ఈ విషయాన్ని సూచించారు. చూడండి.

"దుష్కర్మఘర్మమపనీయ", "దురితాహరణోద్యతాని" శంకరవాక్కు వేదతుల్యం. ఆయన లోకాతీతుడయిన జ్ఞాని. జ్ఞానతపస్వి.

"జ్ఞానీత్వాత్మైవ కేవలమ్" ఇది భగవంతుని వాక్కు. విశ్వగురువు జగద్గురువు నోట పలికించిన అపర శ్రీసూక్తము ఈ స్తోత్రము. వారి వాక్కులో 'లక్ష్మి' ఉంటుంది. 'వచనాంగమానసైః' అన్న మాటలో వారదే సూచించారు. శ్రీసూక్తం గూడా చివరి మంత్రంలో ధీరవాక్కులో లక్ష్మి ఉంటుందని చెప్పింది. చూడండి.

"సక్తుమివ 'తితఉ'నా పునంతో – యత్ర ధీరా మనసావాచమక్రత,
అత్ర సఖాయ స్సఖ్యాని జానతే – భద్రైషాం లక్ష్మీః నిహితాధివాచి"



అనగా, 'జల్లెడ' తో సత్తుపిండిని పవిత్ర పరచినట్లు ధీరులు తమ మనస్సుతో వాక్కును శుద్ధంగా చేస్తారు. ఆ వాక్కుతో స్నేహితులు స్నేహాలు తెలిసికొంటారు. (శబ్దార్థాలు తమ సఖ్యాన్ని తెలిసికొంటాయి) వారి వాక్కులో భద్రమూర్తి అయిన లక్ష్మి ఉంటుంది. అని అదే అన్నాడు భవభూతి.

"లౌకికానాం హి సాధూనాం – అర్థం వాగనువర్తతే ।
ఋషీణాం పునరాద్యానాం – వాచమర్థోనుధావతి "

అంతేగాదు ఆర్షవాక్కు గురించి అందులో లక్ష్మి ఉంటుందని భవభూతి ఉత్తరరామచరితంలో అంటాడు.

ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానాం
యే వ్యాహారాః తేషు మా సంశయోభూత్ ।
భద్రాహ్యేషాం వాచి లక్ష్మీః నిషక్తా
నైతే వాచం విప్లుతార్థాం వదంతి ॥

వాక్కును అగ్ని అని, ధేనువని చెప్తారు. ఈ ధీరుని వాగగ్నిధారయే యీ కనకధార. అదే యీ సువర్ణధార. ఆనందించండి.

ఇందులో కొన్ని శ్లోకాలు లక్ష్మీనారాయణుల వివాహదాంపత్యాదులను అందంగా వర్ణించాయి. కనుక పెళ్లికి సిద్ధమయిన వధూవరులు గూడా అట్టి అనుసంధానంతో పారాయణ చేయదగిన "కళ్యాణధార" ఇది అని నా జ్ఞాన ఘోష. కళ్యాణం అంటే బంగారం అని మరొక అర్థం. ప్రధానంగా వర్ణింపబడిన విషయం "దేవీకటాక్షం". అదే కళ్యాణరూపం సంపద్రూపం అదే కారుణ్యరూపం. అందువలన దీనిని, కటాక్షధారాస్తోత్రం అనవచ్చు. "అపాంగలహరీస్తోత్రం" అనిగూడా అనవచ్చును – అని నా ఆనందఘోష.

ఏదయినా మొత్తంమీద ఈ "స్తవం" శబ్దార్థాలంకార శృంగారాద్యంగములతో చక్కని భక్తిభావధ్వనులకు ఆలవాలమై మనోవాక్కులకు ప్రసాదం కలిగిస్తుందన్నది అనుభవసత్యం.

**తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యే ।**

ఇట్లు
మేళ్లచెర్వు వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి.

# కనకధారాస్తవః

శ్లో॥ **వందే వందారుమందార - మిందిరానందకందలమ్ ।**
**అమందానందసందోహ - బంధురం సింధురాననమ్ ॥ 1 ॥**

ప్రతిపదార్థం : వందారు – నమస్కరించు భక్తులకు, మందారమ్ – కల్పవృక్షము వంటివాడు, ఇందిరా – లక్ష్మీదేవికి, ఆనంద – ఆనందముయొక్క, కందలం – మొలక వంటివాడు, అమంద – అధికమయిన, ఆనంద – ఆనందములయొక్క, సందోహ – సమూహముచేత, బంధురమ్ – దట్టమయిన/నిండిన వాడును లేదా సుందరమయిన వాడును అగు, సింధుర – గజము యొక్క, ఆననమ్ – ముఖం వంటి ముఖము గలవాడును అగు విఘ్నేశ్వరుని, వందే – నమస్కరించెదను.

తాత్పర్యం : భక్తులకు కల్పవృక్షము, లక్ష్మీ – ఆనందముల అంకురమయిన వాడును, అధికానందసమూహములతో అందమయిన వాడును అగు గజాననునకు నమస్కరించెదను.

విశేషములు : 1. ఇందిరానందకందలం అనుట వలన లక్ష్మీగణపతి అని భావించాలి.

2. లక్ష్మీ సంబంధమయిన ఆనందములను ప్రసాదించువాడు కనుక లక్ష్మీగణపతి అని అర్థము. మరియు 10 వ శ్లోకంలో లక్ష్మీ–అద్వైతం చెప్పాడు. అందువలన ఆమె "గౌరి".

3. ఐశ్వర్యములలో గజాంతైశ్వర్యము (నుడికారం) చివరిది. అట్టి ఐశ్వర్యమునకు మొక్కవంటి వాడు. ఐశ్వర్యమునకు ఆనందమునకున్ను అంకురమైనవాడవచ్చును.

4. తుండ స్వరూపం, చెవులు విత్తనం నుంచి వచ్చే 'ఆకులు, కాడ' తో పోలుతుంది కనుక 'కందలం' అన్నారు.

5. ఆనందరూపబ్రహ్మముగా గణపతి చెప్పబడినాడు.

6. ఇందులో వృత్త్యనుప్రాసాలంకారం రూపకాలంకారం ఉన్నాయి.

7. అద్వైతవాది అయిన శంకరుల దృష్టిలోనేకాదు లక్ష్మీసహస్ర నామంలో గూడా లక్ష్మీదేవత సకల దేవతారూపగా కనబడుతున్నది. ఈమె త్రిమూర్తుల త్రిశక్తులలోనిది కాక నారాయణుని



అర్థాంగి అయిన మూలశక్తిగా కనబడుతున్నది. చూడండి.

"ఉమా భగవతీ దుర్గా - చాంద్రీ దాక్షాయణీ శివా ।
పార్వతీ పరమా దేవీ - గౌతమీ గోమతీ గౌరీ ।
ఈశానా హంస వాహినీ - పరమేశ విభూతిశ్చ । లక్ష్మీ సహస్రనామస్తోత్రమ్.

సర్వమంగలమాంగల్యే - శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే దేవి - నారాయణి నమోఽస్తు తే ॥

అని శ్రీసూక్తం చివర, లక్ష్మీసహస్రనామం చివర ఉన్న యీ శ్లోకం లక్ష్మికి గౌరితో అభేదం చెప్తున్నది. కనుక వినాయకుడు లక్ష్మికి ఆనందకందము కావచ్చును. లక్ష్మి త్రిలోచనురాలు కావటం, గౌరితో అభేదం కదా! అంతేకాదు

"బాలార్క కోటి ప్రతిభాం త్రిణేత్రాం - భజేఽహమంబాం జగదీశ్వరీం తామ్"
అని శ్రీసూక్తంలో మరో మంత్రం గూడా లక్ష్మిని 'త్రిణేత్ర'గా చెప్తున్నది.

8. "హస్తినాదప్రబోధినీం" కనుక హస్తిముఖుడు ఆమెకు ఆనంద హేతువుకావచ్చును.

***

శ్లో॥ **అంగం హరేః పులకభూషణమాశ్రయంతీ**
**భృంగాంగనేవ ముకులాభరణం తమాలమ్ ।**
**అంగీకృతాఖిలవిభూతిరపాంగలీలా**
**మాంగల్యదాస్తు మమ మంగలదేవతాయాః ॥ 2 ॥**

మంజులకోరకాంచిత తమాలము భ్రామరి చేరు సంపదల్
రంజిల రోమహృష్ట హరిరమ్యశరీరము కౌగిలించు న
య్యంజననీల సర్వజగదర్థిత మంగళ దేవతా దృశా
ఖంజన లీల నాకిడు సుఖంబుగ మంగల సన్నిధానముల్.

ప్రతిపదార్థం : ముకుల – మొగ్గలు, ఆభరణం – సొమ్ములుగాగల, తమాలమ్ – కానుగ చెట్టును, ఆశ్రయంతీ – ఆశ్రయించిన, భృంగాంగనేవ – ఆడు తుమ్మెదవలె, పులక – గగుర్పాటు, భూషణం – సొమ్ముగాగల, హరేః – విష్ణువు యొక్క, అంగమ్ – శరీరమును, ఆశ్రయంతీ – ఆశ్రయించునదియు, అంగీకృత – అంగీకరింపబడిన/శరీరంగా చేసుకొనబడిన, అఖిల – సమస్తమయిన, విభూతిః – అణిమాది సంపదలుగలదియు అగు, మంగలదేవతాయాః – లక్ష్మి యొక్క, అపాంగలీలా – కటాక్షలీల, మమ – నాకు, మాంగల్య – మంగళమును (తాళిబొట్టును), దా – ఇచ్చునదిగా, అస్తు – అగుగాక.

తాత్పర్యం : మొగ్గలు తొడిగిన నల్లని కానుగుచెట్టును ఆశ్రయించిన తుమ్మెద వలె,

లక్ష్మీకటాక్షలీల పులకాంకుర సుందరమయిన పురుషోత్తమ నీల శరీరమును ఆశ్రయించినది. తుమ్మెద కానుగ మొగ్గల పరాగమును అద్దికొన్నట్లు ఈ కటాక్షరేఖ గూడా విష్ణువిభూతులను అద్దికొన్నది. లేదా ఈ శ్రీ కటాక్షముల శరీరము సర్వసంపదలే. అట్టి మంగళదేవత కటాక్ష పంక్తి నాకు మాంగల్యమునిచ్చుగాక!

విశేషములు : 1. పెళ్లికాని పిల్లలు పారాయణ చేయదగినది – ఈ శ్లోకం. ఇందులో పెండ్లి చూపులు, అనపగామి అయిన దాంపత్యము, శృంగారవాంఛ, తాళిబొట్టుల సూచన ఉన్నవి. స్త్రీ పురుషుని చేరటం ఉన్నది. పులకలు ఆభరణాలుగా గల అంగమే అనగా శరీరమే విభూతిగాగల మగువ కానుక ఉన్నది.

2. వృత్త్యను ప్రాసాలంకారము, చక్కని శయ్య ఉపమాలంకారము ఉన్నవి.

3. కానుగ నలుపు, హరిదేహం నలుపు, ముకులములు పులకలు నలుపు, తుమ్మెదనలుపు, దేవి కటాక్షలీల నలుపు – సావయవోపమ.

4. విభూతులు అంగము అని చెప్తూ అంగము తొలగిన (అపాంగ) అనటం విరోధాభాసధ్వని.

5. ముందే ముకుళించిన కానుగతో పోలిక వలన హరిశరీరమునందు పులకలు గూడా ముందే ఏర్పడినట్లు గ్రహించాలి. కనుక కటాక్షప్రసక్తితోనే పులకలు వచ్చినట్లు వ్యంగ్యం. చపలాతిశయోక్తి ధ్వని.

6. లేదా కారణం కన్న ముందే కార్యం వచ్చినట్లున్నది గనుక అత్యంతాతిశయోక్తి ధ్వని.

7. హరినీలదేహమునకు దేవీ నీలకటాక్షములకు యోగం – సమాలంకార ధ్వని.

8. 'అం' బీజంతో, 'గం' బీజంతోను మొదలయినదీ ప్రార్థన. 'అం' సర్వదేవతా సూచకం విష్ణు సూచకం. 'గం' గణపతి సూచనం.

9. మమ – నాకు అనటం విచిత్రం. కథను బట్టి ఒక దరిద్ర విప్రుని కోసం లక్ష్మిని ప్రార్థిస్తూ, 'మమ' అనటం ఏమిటి? అభేద భావన కావచ్చును. తనను అతనికి ప్రతినిధిగా చెప్పడం – తనకు ఈ పని చేసి పెట్టమని వారి, తరపున కోరటం కావచ్చును.

10. 'అ,ఇ,మ,మా,ఈ' ఈ అక్షరాలు లక్ష్మీబీజాలు. ఈ స్తోత్రంలో ఎక్కువగా ఈ అక్షరాలు తగులుతున్నాయి. సంధిలో "ఈ" చాలాచోట్ల విడదీస్తే కనబడుతుంది.

1) నారాయణ ప్రణయినీ – నీ+ఈ 2) ఆశ్రయంతీ+ఈ ఇలా.

11. సర్వమంగళసంపన్నా , సాక్షాన్మంగళదేవతా, మంగళం మంగళానాం త్వం – లక్ష్మీ సహస్ర నామాలు.



"సర్వమంగళమాంగళ్యే – శ్రీసూక్తం. అందువలన"మంగళదేవతాయాః" అన్నారు.

"రమా మంగళదేవతా" అని అమరం.

12. అంగీకృతాఖిలవిభూతిః – అనగా "సర్వసంపత్తిరూపిణీ" "చంద్రాం హిరణ్మయీం" "కారుణ్యాకారసంపత్తిః"

13. ఈ స్తోత్రంలో చాలాసార్లు పద్మ ప్రస్తావన వస్తుంది. ఇతర స్తోత్రాలలోనున్న సంప్రదాయమే అది. ఆమె షట్పద్మశక్తి గదా! చూడండి.

"పద్మే పద్మాలయే పద్మే" – లక్ష్మీ సహస్ర నామాలు

"పద్మేస్థితాం పద్మవర్ణాం", "పద్మాసనే పద్మఊరూ పద్మాక్షీ పద్మ సంభవే" – శ్రీసూక్తం.

14. యత్కటాక్షసముపాసనా అన్న శ్లోకాన్ని బట్టి లక్ష్మీకటాక్షోపాసనయే ఈ స్తోత్ర అంతర్యమని చెప్పవచ్చును.

***

శ్లో॥ **ముగ్ధా ముహుర్విదధతీ వదనే మురారేః**
**ప్రేమత్రపాప్రణిహితాని గతాగతాని ।**
**మాలా దృశోర్మధుకరీవ మహోత్పలే యా**
**సా మే శ్రియం దిశతు సాగరసంభవాయాః ॥ 3 ॥**

నలముదరిజేరు తుమ్మెద చెలియవోలె
సిగ్గుపెరిమలు సేయు నిషేధవిధుల
చెలువు ముఖమున రాకపోకల నొనర్చు
శ్రీ కటాక్షాళి నాకగు "శ్రీవిధాత్రి"

ప్రతిపదార్థం : సాగరసంభవాయాః – సముద్రకన్య అయిన లక్ష్మియొక్క, యా – ఏ, దృశోః – నేత్రముల యొక్క, మాలా – దృష్టి పంక్తి, మహోత్పలే – కమలమునందు, పెద్ద కలువయందు, ముగ్ధా – మోహంగల, మధుకరీవ – ఆడు తుమ్మెద వలె, మురారేః – విష్ణువు యొక్క, వదనే – మొగము నందు, ముగ్ధా – మోహముగలదై, ముహుః – మాటికి, ప్రేమ – ప్రేమచేత, త్రపా – సిగ్గుచేత, ప్రణిహితాని – ప్రేరితమయిన, గతాగతాని – రాకపోకలను, విదధతీ – చేయుచున్నదో, సా – ఆ కటాక్ష పంక్తి, మే – నాకు, శ్రియమ్– సంపదను, దిశతు – ఇచ్చుగాక!

తాత్పర్యం : "లక్ష్మీదేవి" సముద్రపుత్రి. ఆమె కటాక్షమాలిక ఒకవైపు ప్రేమతో మరొక వైపు సిగ్గుతో ముందు వెనకలాడుచు శ్రీహరివదనము మీదకు రాకపోకలు చేస్తున్నది. అది చాల ముగ్ధ అయినది. మోహం, అమాయికత్వం ఉన్న కటాక్ష మాలిక. ఒక

అమాయికమయిన కన్నె తుమ్మెద తొలిసారిగా కమలము మీదకు సంకోచంగా రాకపోకలు చేస్తున్నట్లుగా నున్నది.

విశేషములు : 1. ఇది సముద్ర మథనానంతరము గాని, తొలికలయిక సమయంలోగాని జరిగిన ఘటనగా వర్ణించటం జరిగింది. పెండ్లి చూపుల వంటి ఘట్టం కావచ్చును. లక్ష్మిని ముగ్ధగా వర్ణించారు. లజ్జా – మన్మథ మధ్యవర్తినిగా ఉండే స్త్రీ 'ముగ్ధ'

2. మహోత్పలం – అంటే రూఢార్థం కమలము. "అరవిందం మహోత్పలం" – అమరం. అయినా విష్ణుముఖం నీలం కనుక 'పెద్దకలువ' అని సూచన వున్నది. కనుక ఇది సాభిప్రాయవిశేష్యము. కనుక పరికరాంకురాలంకార ధ్వని

"సాభిప్రాయే విశేష్యే తు – భవేత్ పరికరాంకురః"

3. అలాగే తుమ్మెదకు శ్రీకటాక్షపంక్తికి, విష్ణువదనమునకు మహోత్పలమునకు సాదృశ్యము కనుక సావయవోపమాలంకారము.

4. ము, ప్ర, త, మ, స అనే అక్షరాలు ఆవృత్తి అయినవి కనుక వృత్త్యనుప్రాస.

***

శ్లో॥ **విశ్వామరేంద్రపదవిభ్రమదానదక్షం**
**ఆనందహేతురధికం మురవిద్విషోఽపి ।**
**ఈషత్ నిషీదతు మయి క్షణమీక్షణార్థం**
**ఇందీవరోదరసహోదరమిందిరాయాః ॥ 4 ॥**

వజ్రపాణికి స్వారాజ్య వైభవంబు
చక్రపాణికి నానంద సాగరంబు
కైరవోదర సోదరాకారకంబు
శ్రీకటాక్షంబు క్షణము నా చిత్తమందు

ప్రతిపదార్థం : విశ్వ – సమస్తమయిన, అమరేంద్ర – దేవశ్రేష్ఠులయొక్క, పదవిభ్రమ – పదవీవిలాసములయొక్క, దాన – ఇచ్చుటయందు, దక్షమ్ – సమర్థమయినదియు, మురవిద్విషోపి – మురారి కయినను, అధికం – మిక్కిలి, ఆనందహేతుః– ఆనందకారణ మయినదియు, ఇందీవర – నల్లకలువయొక్క, ఉదర – లోపలి లేతనీల వర్ణమునకు, సహోదరమ్ – సోదరమయిన అనగా సమాన వర్ణమయిన, ఇందిరాయాః – లక్ష్మీదేవియొక్క, ఈక్షణార్థమ్ – కటాక్షము, మయి – నాయందు, క్షణమ్ – ఒక క్షణము, ఈషత్ – కొద్దిగా, నిషీదతు – ఉండుగాక!

తాత్పర్యం : అమ్మవారి కటాక్షము సమస్త దేవశ్రేష్ఠులకు పదవీ విలాసాలను ఇవ్వగల



సమర్థమయినది. అంతేకాదు. మహావిష్ణువునకు గూడా అధికానందకారణం. ఆమె తనను చూస్తే చాలు – ఆయన ఆనందసముద్రంలో విహరిస్తాడు. నీలోత్పలము లోపలి సున్నితమయిన నీలవర్ణము వంటి వర్ణముగల ఆ శ్రీదేవి కటాక్ష లేశము నాయందు ఒక క్షణం కొద్దిగా ఉండుగాక!

విశేషములు : 1. ఆనందహేతువయిన "రధికము" లక్ష్మీకటాక్షమని చెప్పవచ్చును. మాధవుడే రధికుడు. ఆయనయందుండే లక్ష్మి ఆయనకు గూడా రధికురాలు. ఆమె చూపూ అంతే.

1. ఆత్మానం రథినం విద్ధి. 2. రథస్థం మాధవం దృష్ట్వా – పునర్జన్మ న విద్యతే

2. ఇందీవరోదరసహోదరం – ఆర్థీ, ఉపమ, వృత్త్యనుప్రాసాలంకారం

3. "శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవబ్రహ్మేంద్రగంగాధరామ్" – శ్రీ సూక్తం.

***

శ్లో॥ **ఆమీలితాక్షమధిగమ్య ముదా ముకుంద–**
**మానందకందమనిమేషమనంగతంత్రమ్ ।**
**ఆకేకరస్థితకనీనికపక్ష్మ నేత్రం**
**భూత్యై భవేన్మమ భుజంగశయాంగనాయాః ॥ 5 ॥**

క్షీరపయోధిమధ్యమున శేషభుజంగ సితాంగ శయ్యపై
సౌరుగ మీలితాక్షుడగు సారసనేత్రు ననంగ తంత్ర భూ
యోరతుజేయు, ప్రేమలలితోజ్జ్వల యా మదనాంబదృష్టి య
వ్వారిగ నన్ను జేయుత మపార శుభావళి భోగపారగున్.

ప్రతిపదార్థం : ముదా – ఆనందముచేత (సంగమానందముచేత), అమీలిత – పూర్తిగా మూయబడిన, అక్షమ్ – కన్నులుగల వాడును, ఆనందకందమ్ – ఆనందమూలమయిన వాడును అగు, ముకుందమ్ – విష్ణువును, అధిగమ్య – పొంది, అనిమేషమ్ – రెప్ప పాటు లేనిదియు, అనంగ – మన్మథునకు, తంత్రమ్ – వశమయినదియు, ఆకేకర – అర్ధమీలిత దశలో, స్థిత – ఉన్న, కనీనిక – కంటిగ్రుడ్డు, పక్ష్మ – రెప్పలు గలదియు అగు, భుజంగశయ – శేషశాయి యొక్క, అంగనాయాః – అర్ధాంగియైన లక్ష్మి యొక్క, నేత్రం – కన్ను అనగా చూపు, మమ – నా యొక్క, భూత్యై – సమృద్ధికి, భవేత్ – కారణము కావలెను.

తాత్పర్యం : ఇది ఉత్థానైకాదశీ దృశ్యం కావచ్చు. లేదా ఉషః కాలము కావచ్చు. ఇందులో లక్ష్మీనారాయణుల సమాగమం సూచింపబడుచున్నది.

ఆనందమనుభవిస్తూ, విష్ణుదేవుడు పూర్తిగా నిమీలిత నేత్రుడయినాడు. ఆనందనిధి అయిన ఆయనను లక్ష్మీనేత్రం మన్మథ పరవశమై అర్ధనిమీలిత స్థితిలో రెప్పపాటు లేకుండా

గమనించి పరవశిస్తూన్నది. అట్టి అనంతశయనుని అర్థాంగీ కటాక్షము నాకు సంపదలు కలిగించుగాక!

విశేషములు : 1. లక్ష్మీనారాయణులు సృష్టికి స్థితికి శక్తులు కనుక, సంహార విషయం ప్రస్తుత సందర్భ విరుద్ధం కనుక, కవి వారి సృష్టి సంకల్పాన్ని కామంగాను, స్థితిని వారి శృంగారానుసంధానంగానూ నర్మగర్భంగా చెప్పాడు.

2. కొన్ని పాఠాలలో 'పద్మనేత్రం' అని ఉన్నది. అది చక్కగా సమన్వయం కాదు. ఆ 'పద్మ' విశేషణం అచ్చట అవసరం గూడా కాదు.

3. విష్ణువు 'అమీలితాక్షుడు' లక్ష్మి 'ఆకేకరాక్షి' కావటం "సృష్టిస్థితులలో శక్తివైభవ ప్రాధాన్యం, పురుషుని ఔదాసీన్యం" అనే దశలను సూచిస్తున్నది. దేవిని సృష్టి శక్తిగా చూపటం, పురుషుని నిర్గుణునిగా చూపటం జరిగింది కదా! తటస్థునిగా అనే అర్థంలో "అమీలితాక్షం" అన్నాడు.

4. స్వామి భిక్షకు వచ్చినది ప్రాతః కాలం కావచ్చును. కథలో బంగారు ఉసిరికాయలు కురిసినట్లున్నది. కనుక ఇది "ప్రబోధనైకాదశి" వంటి ఘట్టం కావచ్చును.

5. అలాగే దిగ్గంతిభిః – అనే 20వ శ్లోకంలో "ప్రాతర్నమామి" అనడం అలాగే అభిషేకం – ఇవన్నీ ప్రాతఃకాల సూచనలు.

6. కమలముల వర్ణన ఎక్కువగా ఉన్న ఈ స్తోత్రంలో కమల వికాసం గల ప్రాతఃకాలమే కాలమని చెప్పటం న్యాయమే.

***

శ్లో॥ **కాలాంబుదాళి లలితోరసి కైటభారేః**
**ధారాధరే స్ఫురతి యా తటిదంగనేవ ।**
**మాతుస్సమస్తజగతాం మహనీయమూర్తిః**
**భద్రాణి మే దిశతు భార్గవనందనాయాః ॥ 6 ॥**

నీలపయోదమేచకము నిర్జర నిర్మిత పారిజాత మా
లాలలితాతిసుందర మిలాధవు వక్షమునన్ బలాకికా
మాలిక గూడు నంబుదము మాటున తళ్కుల చిల్కునట్టి శం
పాలతనా జెలంగు సిరి మంగళమూర్తి శుభంబు నాకిడున్.

ప్రతిపదార్థం : సమస్తజగతామ్ – సర్వప్రపంచములకు, మాతుః – మాతయయిన, భార్గవనందనాయాః – భృగువంశజ యయిన లక్ష్మి యొక్క, యా – ఏ, మహనీయ – పూజనీయమైన, మూర్తిః – శరీరము, ధారాధరే – మేఘమునందు, తటిదంగనేవ – మెరుపుతీగవలె, కైటభారేః – కైటభమర్దనుడైన విష్ణువుయొక్క, కాలాంబుదాళి – నీలమేఘబృందమువలె, లలిత – మనోహరమయిన, ఉరసి – రొమ్మునందు, స్ఫురతి – ప్రకాశించునో, ఆ దేవీశరీరము, మే – నాకు, భద్రాణి – క్షేమములను, దిశతు – ఇచ్చునుగాక!



తాత్పర్యం : నీటి మబ్బులో మెరసిన మెరుపుతీగలాగా మహాలక్ష్మి గౌరశరీరలత నీలమేఘశ్యాముని వక్షఃస్థలంలో స్ఫురిస్తుంది. ఆ సమస్త జగన్మాత యొక్క మహనీయ మూర్తి నాకు క్షేమంకరి అగుగాక!

విశేషములు : 1. ఇందులో దేవీ మూర్తిని స్తుతిస్తున్నాడు.

2. ఇందులో ఉపమాలంకారము. వృత్త్యనుప్రాస, తెలుగు పద్యములందు వలె యతిన్యాసము ఉన్నాయి.

3. "పీతా వర్ణాయ విజ్ఞేయా" అని పచ్చని మెరుపుతీగ వర్ణసూచకము. అది అభ్యుదయ సంకేతము. లక్ష్మి హిరణ్యవర్ణగదా!

4. "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవభాస్వరా, నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్య ణూపమా" అనే వర్ణన ప్రకారం "లక్ష్మి" యోగశాస్త్రోక్తమయిన "కుండలినీశక్తి"

5. ఆమె 'హిరణ్య వర్ణ" అన్న సంగతి సంప్రదాయసిద్ధమే.

"హిరణ్యవర్ణాం హరిణీం" – శ్రీసూక్తం.

"హిరణ్యకేశినీ హేమా", "హిరణ్యవర్ణ రూపా చ – హిరణ్యపదసంభవా" – లక్ష్మీ సహస్రనామాలు

"హిరణ్యం" అనగా 'విష్ణువ'ని, ఆయనకు వర్ణం ఈమె అని శ్రీపురాణం.

"హిరణ్యం విష్ణురాఖ్యాతః తస్య వర్ణస్తు వైష్ణవీ"

6. ఆమె విద్యుత్కాంతి గలది. చూడండి "తటిత్కోటిలసత్కాంతిః తరుణీ హరిసుందరీ" – లక్ష్మీ సహస్రనామాలు

7. ఆమె యోగశక్తి. చూడండి. "ఇడాపింగళికామధ్యా, మృణాలీతంతురూపిణీ, చక్రిణీ, చక్రమధ్యస్థా, చక్రమార్గప్రవర్తినీ", " ఇడా పింగళికా మధ్య సుషుమ్నా గ్రంథిభేదినీ" – లక్ష్మీ సహస్రనామాలు. కనుక ఆమె విష్ణుని యోగమాయ. మనలోని యోగశక్తి.

***

శ్లో॥ **బాహ్వంతరే మురజితః శ్రితకౌస్తుభే యా**
**హారావళీవ హరినీలమయా విభాతి ।**
**కామప్రదా భగవతోఽపి కటాక్షమాలా**
**కల్యాణమావహతు మే కమలాలయాయాః ॥ 7 ॥**

కౌస్తుభాంచిత వైష్ణవోరస్తలాంచ
దైంద్రనీలమణీమాలయా? యనంగ,
చక్రికైనను కామసంజననియైన
కమలదృఙ్మాల కల్యాణకారి నాకు.

ప్రతిపదార్థం : కమలాలయాయాః – పద్మాలయ అయిన లక్ష్మియొక్క, యా – ఏ, కటాక్షమాల – అపాంగ వీక్షణమాలిక, మురజితః – మురారి యొక్క, శ్రితకౌస్తుభే – కౌస్తుభధరమయిన, బాహ్వంతరే – ఉరమునందు, హరినీలమయీ – ఇంద్రనీలమణి రచితమైన, హారావళీవ – గొలుసుల పేరు వలె, విభాతి – ప్రకాశించునో, యా – ఏ కటాక్షమాల, భగవతోఽపి – షడ్విధ ఐశ్వర్యము గల విష్ణువునకు గూడా, కామప్రదా – కోర్కెలు తీర్చునదియో, సా – ఆ కటాక్షమాలిక, మే – నాకు, కల్యాణమ్ – శుభమును, బంగారమును, (పెండ్లిని), ఆవహతు – కలిగించునుగాక!

తాత్పర్యం : కమలాలయాదేవి యొక్క కటాక్షవీక్షణపంక్తి కౌస్తుభకాంతులతో వెలుగు విష్ణు వక్షఃస్థలమునందు ఇంద్రనీలహారంలాగా మెరుస్తున్నది. ఆ కటాక్షమాల షడ్విధైశ్వర్య సంపన్నుడయిన విష్ణుభగవానునకు గూడా కోరికలను ప్రసాదించగలది. అట్టి మాతృ కటాక్షవల్లరి నాకు కల్యాణమును కలిగించుగాక!

విశేషములు : 1. అతద్గుణాలంకారధ్వని. కౌస్తుభచ్ఛాయవలన లక్ష్మి కటాక్షపంక్తి తెల్లగా మారక ఇంద్రనీలవర్ణంగానే ఉన్నది గదా!

2. "భగం" అంటే 6 రకాల ఐశ్వర్యము 1.ఐశ్వర్యం 2.వీర్యం 3.యశస్సు 4.శ్రీ 5.జ్ఞానము 6.వైరాగ్యము. అలాగే 1.ఉత్పత్తి 2.లయము 3.ప్రాణుల రాక 4.పోక 5.విద్య 6.అవిద్య

3. అట్టి భగవంతునికే కామప్రద అంటే ఆయన సంకల్పశక్తి. ఆయన గృహిణి, ఆయనకయినా వరాలనిచ్చేది కనుక భగవంతునికన్న ఆమె గొప్పదని ధ్వని.

4. ఈ శ్లోకం గూడ కల్యాణకాంక్షులయిన వధూవరులు పారాయణ చేయదగినదే.

5. దీనిలోనూ సమానాక్షరాలతో తెలుగు యతుల అందం కనబడుతున్నది.

6. కామప్రదా – "చింతామణిః, చిదానందా; పంచబాణప్రబోధినీ", "కాంతా కామ్యవరప్రదా" – లక్ష్మీ సహస్ర నామాలు – 'కామ' అనగా కోరికలు, మన్మథుడు అను రెండు అర్థములు సంప్రదాయసిద్ధములే.

***

**శ్లో॥ ప్రాప్తం పదం ప్రథమతః ఖలు యత్ప్రభావాత్**
**మాంగల్యభాజి మధుమాథిని మన్మథేన ।**



**మయ్యాపతేత్తదిహ మంథర మీక్షణార్థం**
**మందాలసం చ మకరాలయకన్యకాయాః ॥ 8 ॥**

మధుదైత్యాంతకునందిదంప్రథమమై మాద్యల్లతాంతాయుధ
ప్రథితావక్రపరాక్రమక్రమ మవాప్త స్థాన మెద్దాన న
య్యె, ధరానందధనాధి ధాత్రి కరుణాహేలాలసద్గాత్రి వా
ర్నిధికన్యాలసమంథరేక్షణిక నన్నే కాచెడిన్ ప్రేముడిన్.

ప్రతిపదార్థం : యత్ – ఏదేవీ కటాక్షముల యొక్క, ప్రభావాత్ – మహిమవలన, మాంగల్యభాజి – మంగళరూపుడయిన, మధు మాథిని – మధుసూదనునియందు, మన్మథేన – మన్మథునిచేత, ప్రథమతః – తొలిసారిగా, పదమ్ – స్థానం, పేరు, ప్రాప్తమ్ – పొందబడెనో, తత్ – అట్టిదియు, మంద – నెమ్మది అయినది గనుకనే, అలసం చ – సోమరిగానున్నదియు, మంథరమ్ – వక్రమయినదియు అగు, మకరాలయకన్యకాయాః – సముద్రపుత్రిఅయిన లక్ష్మీదేవియొక్క, ఈక్షణార్థమ్ – కటాక్షము, ఇహ – ఇచ్చట, మయి – నాయందు, ఆపతేత్ – ప్రసరించునుగాక!

తాత్పర్యం : మన్మథుడు లక్ష్మీపుత్రుడు. కనుక లక్ష్మి కటాక్షప్రసారం వలన చలితుడైన నారాయణునికి లక్ష్మికి మన్మథుడు పుట్టాడు. కనుక తొట్టతొలిగా అతనికి ఉనికి, పేరు, పదవి వారి వలన అబ్బినవి. లేనట్లయితే మధుసూదనునియందు మన్మథుడు అవకాశం పొందలేడు. సృష్టి జరుగదు. అందుకు కారణమయిన ఆ క్షీరార్ణవ పుత్రికా కటాక్షము నాయందు ప్రసరించుగాక! ఆ మన్మథుని వలెనే నేను గొప్ప వాడనవుతాను. విష్ణుప్రసాదం పొందుతాను అని భావము.

విశేషములు : 1. "దరవక్రే చ మంథరం" అని త్రిపాదశేషము. కనుక 'మంథరం' అంటే కొంచెము వంకర చూపు అనగా క్రీగంటి చూపు.

2. మాంగల్య భాజి – అంటే తాళిగలవాడని అర్థం చెప్పవచ్చును. అనగా 'లక్ష్మి' ఆయన హృదయంలో ఉన్నది కనుక ఆమె మాంగల్యం ఆయనకున్ను ఉన్నట్లేగదా!

3. దీనిలో "ప,మ" ఆవృత్తమయినవి. చాలా చక్కని వృత్త్యనుప్రాసాలంకారము.

4. హరికామరూపురాలు ఆమె. ఆయన సంకల్పశక్తి ఆమె. ఆయన ఐశ్వర్యశక్తి ఆమె. సృష్టి సంకల్పము, సృష్టి స్థితివైభవము – అంతా అయన యొక్క శక్తి విలాసమే గదా! కనుకనే ఆమె కటాక్షం వలన విష్ణువులో మన్మథుడుదయించాడు. అదే యీ పద్యభావము. లక్ష్మీసహస్రనామాలు గూడా "త్వమంబ విష్ణుసర్వస్వం", "విష్ణుచేతనా" అన్నది. హరి శక్తి రహస్యమిదే. హరశక్తి తత్త్వమూ ఇదే. విభూతితో పంగనామాలు, నాముతో త్రిపుండ్రాలు పెట్టికొన్నట్లే ఇది.

***

శ్లో॥ **దద్యాత్ దయానుపవనో ద్రవిణాంబుధారాం**
**అస్మిన్నకించనవిహంగశిశౌ విషణ్ణే ।**
**దుష్కర్మఘర్మమపనీయ చిరాయ దూరం**
**నారాయణప్రణయినీ నయనాంబువాహః ॥ 9 ॥**

సన్నుతదుగ్ధసింధు తనుజానయనాంబుద రమ్యమూర్తి ని
ర్ణున్నమదీయ పాపతపరూషణయై హరియాన బూనికన్
నన్ను నకించనద్విజు ననారతపూజిత పద్మజాంఘ్రి సం
పన్నసుభావుడన్నుత కృపానిలజుష్ట సువర్ణధారలన్.

ప్రతిపదార్థం : నారాయణ – నారాయణుని యొక్క, ప్రణయినీ – ప్రియురాలయిన శ్రీ దేవత యొక్క, నయన – కన్ను అనే, అంబువాహః – మేఘము, దుష్కర్మ – పూర్వజన్మ పాపములనే, ఘర్మమ్ – వేసవితాపమును, చిరాయ – చాలాకాలము, దూరమ్ – మిక్కిలిగా, అపనీయ – తొలగించి, దయా – దయయే, అనుపవనః – తోడుగాలిగాగలదై, అస్మిన్ – ఈ, విషణ్ణే – దుఃఖితుడైన, అకించన – దరిద్రుడనే, విహంగశిశౌ – పక్షికూనయందు, ద్రవిణ – ధనమనే, అంబుధారామ్ – జలధారను, దద్యాత్ – కురియుగాక !

తాత్పర్యం : అకించన విహంగం అనగా దరిద్రపక్షి అయిన చాతకము. దానినే వానకోకిల అంటారు. అది మబ్బునుంచి పడే నీటి బిందువుల కోసం దాహంతో ఎదురుచూస్తుంది. అకించనుడంటే ఏమీలేనివాడు – దరిద్రుడు అని అర్థము. లక్ష్మీనేత్రం అనగా దృష్టి అనే నల్లని మబ్బు దరిద్రుడనే చాతకపక్షిని క్రమ్మివేసిన దుష్కర్మఫలమనే సంతాపమును దూరంగానెట్టి వేసి "దయ" అనుగాలి బలం తోడుగా చేసికొని ధనమనే నీటిని ధారలుగా కురిసి యీ దరిద్రద్విజుని కాపాడు గాక!

విశేషములు : 1. ఇది సావయవరూపకం. దీనికి కొద్దిగా 'శ్లేష' సహాయకము. దయ అనేగాలి. ధనమనే జలము, దరిద్రుడనే చాతక శిశువు, ప్రారబ్దమనే ఆవిరి. లక్ష్మీదృష్టి అనే మబ్బు ఇవి రూపకభాగాలు.

2. ఇందులో "అకించన విహంగ శిశువు" అన్నచోట – చాతక శిశువని అర్థం చెప్తే అతిశయోక్తి అవుతుంది. దానికి 'శ్లేష' కారణం. 'దరిద్ర పక్షికూన' అని జాలిగొలిపే పదంగా భావిస్తే సరిపోతుంది. 'ద్విజ' శబ్దానికి 'విహంగ' అనేది అనువాదంగా గ్రహించాలి.

3. కథలోని 'దరిద్రుడు' శిశువు కాదు. ఒక గృహస్థే. మరి "శిశువు" అనడం ఎలా? అంటే ఆదిదేవి ముందర అందరం శిశువులమే కదా! అందువలన అలా చెప్పటం జరిగింది. లేదా, తనే మధ్యవర్తి గనుక తాను శిశువునని చెప్పవచ్చును.



4. ఈ శ్లోకాలన్నింటిలో వృత్త్యనుప్రాస, తెలుగు యతుల సౌందర్యం వెల్లివిరిసి ఉన్నాయి. ఇది సమానంగా ఉన్న విషయం. ముందు పద్యాలలోనూ అలాగే చూడవలసినది.

5. "కారుణ్యాకార సంపత్తిః" కనుక ఆమె దయ సంపదయే. ఆమె చూపుగూడ సంపదయే.

6. ఆమె లక్ష్మీసహస్రనామం ప్రకారం "దారిద్ర్యధ్వంసినీ దేవీ", "దుర్భిక్షధ్వంసినీ", "సర్వదారిద్ర్యభంజినీ"

7. దేవిని మేఘంగా చేసిన భావన శ్రీసూక్తంలోనూ ఉన్నది. "వర్షంతు తే విభావరి । దివో అభ్రాన్న విద్యుతః । రోహంతు సర్వబీజాని । అవబ్రహ్మద్విషో జహి"

ఓ విభావరీ! అనగా రాత్రిరూపమయిన ప్రభాశాలినీ! పూర్ణిమా రాత్రి వంటిదానా! మబ్బునుండి మెరుపులు వచ్చినట్లు నీనుండి మాకు ద్యులోకసంబంధమయిన మెరుపులు దిగుగాక! వాటివలన సమస్త బీజములు మొలుచుగాక! వేదద్వేషులను దేవద్వేషులను నశింపజేయుము" అని అర్థము.

8. ఈ శ్లోకంలోని "ద్రవిణాంబుధారా" పదమువలననే ఈ స్తోత్రానికి కనకధారాస్తవ మన్నపేరు వచ్చియుండును.

***

శ్లో॥ **ఇష్టావిశిష్టమతయోఽపి నరా యయా ద్రాక్**
**దృష్టాః త్రివిష్టపపదం సులభం భజంతే ।**
**దృష్టిః ప్రహృష్టకమలోదరదీప్తిరిష్టాం**
**పుష్టిం కృషీష్ట మమ పుష్కరవిష్టరాయాః ॥ 10 ॥**

నిఖిల విబుధాళిసంస్తవనీయభోగ
నిరతుగావించు భక్తినిర్ణిద్రునేది
ఆ మహాలక్ష్మి జలజోదరాభసదయ
దృష్టియిడు సర్వకల్యాణపుష్టి నాకు.

ప్రతిపదార్థం : యయా – ఏదేవతచేత, దృష్టాః – చూడబడిన, నరాః – మనుష్యులు, (జీవులు), ఇష్ట – ఇష్టమయిన వారు, అవిశిష్టమతయోఽపి – సాధారణ బుద్ధిగలవార యినను, ద్రాక్ – వెంటనే, త్రివిష్టపపదమ్ – స్వర్గమును, భజంతే – పొందుదురో, పుష్కర – కమలము, విష్టరాయాః – పీఠముగాగల ఆ లక్ష్మీదేవి యొక్క, ప్రహృష్ట – వికసించిన, కమల – తామరపూవు యొక్క, ఉదర – మధ్య భాగముయొక్క, దీప్తిః – కాంతి వంటి కాంతిగల, దృష్టిః – చూపు, మమ – నాకు, ఇష్టామ్ – కోరబడిన, పుష్టిమ్ – బలమును, కృషీష్ట – కలిగించుగాక !

తాత్పర్యం : లక్ష్మీకటాక్షం తగిలిన భక్తులు విశిష్ట బుద్ధిశాలులు కాకపోయినను, వెంటనే సులభంగా స్వర్గమును పొందగలరు. అట్టి కమల సమానమయిన కమలాసనా కటాక్షం నాకు ఇష్ట పుష్టిని కలిగించుగాక!

విశేషములు : 1. "నరా దయార్ద్ర" అని పాఠాంతరం ఉన్నది. కాని అది చక్కగా లేదు. కనుక "నరా మయా ద్రాక్" అన్నదే గ్రహించాను.

2. 'ష్ట' అనుప్రాస. పెద్ద విశేష గుణాలు లేవు.

3. దేవీ ఉపాసన వలన అదిగూడా ఆమె కటాక్షోపాసన వలన సేవకునకు సకలార్థములు గూడునని "యత్కటాక్షసముపాసనా" అని చెప్పారు. కనుక ఆమెకు భక్తులయిన వారు సాధారణమతులయినా ఆమె అనుగ్రహంతో వారికి సద్గుణాలు వస్తాయి. దుర్గుణాలు పోతాయి. చూడండి. "న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా" – శ్రీసూక్తం.

4. అదే అన్నారు శంకరులు "గుణాధికాగురుతరభాగ్యభాజినః" అని గుణాధికులవుతారని చెప్పారు. భాగ్యవంతులవుతారనీ అన్నారు.

***

శ్లో॥ **గీర్దేవతేతి గరుడధ్వజసుందరీతి**
**శాకంభరీతి శశిశేఖరవల్లభేతి ।**
**సృష్టిస్థితిప్రళయకేళిషు సంస్థితా యా**
**తస్యై నమః త్రిభువనైకగురోః తరుణ్యై ॥ 11 ॥**

శాంభవియంచు దుష్టజనచండికయంచు జగద్ధితంకరా
రంభయటంచు మౌనిజనరమ్యగుణోత్తరరూపయైన శా
కంభరియంచు పద్మభవకామినియంచు నుతింపగా జగ
ద్గుంభన పోషనాశములగూర్చెడి యంబకు గేలు మోడ్చెదన్.

ప్రతిపదార్థం : గీర్దేవతేతి – సరస్వతి అని, గరుడధ్వజ – విష్ణువునకు, సుందరీతి – సుందరియని, శాకంభరీతి – శాకంభరీ అను దుర్గావతారమని, శశిశేఖర – శివునికి, వల్లభేతి – భార్యయని, యా – ఏ దేవి, సృష్టిస్థితిప్రళయకేళిషు – సృష్టిస్థితిసంహార క్రీడలలో, సంస్థితా – ఉన్నదో, తస్యై – ఆ, త్రిభువన – ముల్లోకములకు, ఏకగురోః – ఒకే గురువయిన శ్రీమన్నారాయణుని, తరుణ్యై – భార్య అయిన శ్రీదేవికి, నమః – నమస్కారము.

తాత్పర్యం : సృష్టి కాలమున వాగ్దేవిగా, స్థితికాలమున వైష్ణవిగా, ప్రళయకాలమున దుర్గగా పార్వతిగా అవతరించే ఆ మహానారాయణశక్తికి నమస్కారము.



విశేషములు : 1. అంటే పరబ్రహ్మ మహిషిని గూర్చి మహాలక్ష్మిగా మహానారాయణిగా చెప్పినట్లే. దుర్గమాసుర సంహారంలో దుర్గ శాకంభరియైనట్లు దేవీభాగవతము.

***

శ్లో॥ **శ్రుత్యై నమోఽస్తు శుభకర్మఫలప్రసూత్యై**
**రత్యై నమోఽస్తు రమణీయగుణార్ణవాయై ।**
**శక్త్యై నమోఽస్తు శతపత్రనికేతనాయై**
**పుష్ట్యై నమోఽస్తు పురుషోత్తమవల్లభాయై ॥ 12 ॥**

శ్రుతియు పుష్టియు శక్తియు రతియు గతియు
జలజనిలయయు రమణీయఫలదమతియు
సుకృతఫలదయు నలనాభసుకృతమూర్తి
యైన శ్రీదేవికంజలి బూనువాడ.

ప్రతిపదార్థం : శుభకర్మ – శుభకర్మలయొక్క ఫల – ఫలములే, ప్రసూత్యై – సంతానముగా గల, శ్రుత్యై – శ్రుతిరూపకు, నమోఽస్తు – నమస్కారమగుగాక!, రమణీయ – మనోహర మయిన, స్త్రీసంబంధమయిన, గుణార్ణవాయై – గుణములకు సముద్రమయిన, రత్యై – రతిదేవికి, నమః – నమస్కారము, అస్తు – అగుగాక! శతపత్ర – కమలము, నికేతనాయై – నివాసముగాగల, శక్త్యై – శక్తికి, నమోఽస్తు – నమస్కార మగుగాక! పురుషోత్తమ – శ్రీమన్నారాయణునకు, వల్లభాయై – ప్రియురాలయిన, పుష్ట్యై – సంపత్ శక్తికి, నమోఽస్తు – నమస్కారమగుగాక!

తాత్పర్యం : శుభకర్మఫలదాయిక అయిన శ్రుతివి నీవు. మనోహరగుణశాలినిఅయిన రతివి నీవు. కమలనివాసిని అయిన శక్తివి నీవు. పురుషోత్తమవల్లభవయిన పుష్టివి నీవు. నీకు నమస్కారము.

విశేషములు : 1.లక్ష్మీసహస్రనామంలో గూడా "శ్రద్ధా। మేధా।కృతిః । ప్రజ్ఞా । ధారణా । కాంతిరేవ చ । శ్రుతిః । స్మృతిః । ధృతిః । ధన్యా । భూతిః । ఇష్టిః । మనీషిణీ । అని బుద్ధిభేధాలు లక్ష్మీస్వరూపమని చెప్పారు. దేవీసప్తశతిలోనూ ఇదే తత్త్వం చెప్పబడినది. "యా దేవీ బుద్ధిరూపేణ సర్వభూతేషు సంస్థితా"

***

శ్లో॥ **నమోఽస్తు నాళీకనిభాననాయై**
**నమోఽస్తు దుగ్ధోదధిజన్మభూమ్యై ।**
**నమోఽస్తు సోమామృతసోదరాయై**
**నమోఽస్తు నారాయణవల్లభాయై ॥ 13 ॥**

వందనమ్ము సితోత్ఫుల్ల పద్మవదన
వందనమ్ము పయోనిధి వంశదీప
వందనమ్ము సుధాచంద్రబంధు నీకు
వందనమ్ము జగన్నాథసుందరాంగి.

ప్రతిపదార్థం : నాళీకనిభ – పద్మసమానమయిన, ఆననాయై – ముఖముగలదేవికి, నమోఽస్తు – నమస్కారమగుగాక! దుగ్ధోదధి – క్షీరసముద్రమే, జన్మభూమ్యై – జన్మభూమి గాగల లక్ష్మికి, నమోఽస్తు – నమస్కారమగుగాక! సోమ – చంద్రుడు, అమృత – అమృతమున్ను, సోదరాయై – సోదరులుగాగల లక్ష్మికి, నమోఽస్తు – నమస్కారమగుగాక! నారాయణ – విష్ణువునకు, వల్లభాయై – ప్రియురాలైన లక్ష్మికి, నమోఽస్తు – నమస్కారమగు గాక!

తాత్పర్యం : కమలముఖికి నమస్కారము. క్షీరార్ణవసంజాతకు నమస్కారము. అమృత, చంద్ర సోదరికి నమస్కారము. నారాయణప్రియకు నమస్కారము.

***

శ్లో॥ **నమోఽస్తు హేమాంబుజపీఠికాయై**
**నమోఽస్తు భూమండలనాయికాయై ।**
**నమోఽస్తు దేవాదిదయాపరాయై**
**నమోఽస్తు శార్ఙ్గాయుధవల్లభాయై ॥ 14 ॥**

స్వర్ణపద్మాసనేశ్వరీ ! వందనమ్ము
వసుమతీలోకనాయికా ! వందనమ్ము
బ్రహ్మదేవాదివత్సలా ! వందనమ్ము
భద్రశార్ఙ్గధరప్రియా ! వందనమ్ము.

ప్రతిపదార్థం : హేమాంబుజ – స్వర్ణకమలము, పీఠికాయై – పీఠముగాగల తల్లికి, నమోఽస్తు – నమస్కారమగుగాక! భూమండల – భూలోకమునకు, నాయికాయై – నాయిక అయిన అంబకు, నమోఽస్తు – నమస్కారము, దేవాది – దేవతలు మొదలగు వారి యందున్ను, దయాపరాయై – దయావతియగు మాతకు, నమోఽస్తు – నమస్కారమగుగాక! శార్ఙ్గాయుధ – కోదండపాణి అయిన విష్ణువునకు, వల్లభాయై – ప్రియురాలయిన లక్ష్మికి, నమోఽస్తు – నమస్కారమగుగాక!

తాత్పర్యం : స్వర్ణకమలాసన, భూలోకనాయిక, దేవాదిదయావతి, శార్ఙ్గపాణి ప్రియ అయిన లక్ష్మీదేవతకు వందనములు.

విశేషములు : 1. ఈ శ్లోకములు మూడు పునరుక్తులతో నిండినవి. విశేషవిషయాలు



లేవు. అయితే పరంపరగా "స్వామి" దేవతకు వందన సమర్పణ చేయదలచినారు. అందువలన ఈ శ్లోకాలు పరంపరగా వచ్చినాయి. అందుకే తరువాత "త్వద్వందనాని" అంటాడు.

2. దేవాది – అంటే దేవ దానవ మానవ జీవులు వస్తారు. దేవి దానవులకు కూడా తనదయను పంచుతుందని అర్థము. లేదంటే రావణాదులకు అంతటి సామ్రాజ్యవైభవము ఎలా వస్తుంది.

"రాక్షసాశ్రితా" – చూడండి లక్ష్మీసహస్రనామాలు "దేవజుష్టాముదారామ్" – శ్రీ సూక్తం.

***

శ్లో॥ **నమోఽస్తు దేవ్యై భృగునందనాయై**
**నమోఽస్తు విష్ణోరురసిస్థితాయై ।**
**నమోఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై**
**నమోఽస్తు దామోదరవల్లభాయై॥ 15 ॥**

భార్గవ మహర్షి నందినీ ! వందనమ్ము
వైష్ణవోరస్స్థలస్థితా ! వందనమ్ము
వారిజాతాలయా ! లక్ష్మి ! వందనమ్ము
ప్రకృతిదామోదరప్రియా ! వందనమ్ము.

ప్రతిపదార్థం : భృగు – భృగు మహర్షికి, నందనాయై – పుత్రిక అయిన దేవ్యై – దేవికి, నమోఽస్తు – నమస్కారమగుగాక! విష్ణోః – విష్ణువు యొక్క, ఉరసి – వక్షఃస్థలమునందు, స్థితాయై – ఉన్నదేవికి, నమోఽస్తు – నమస్కారమగుగాక! కమలాలయాయై – కమల నివాసిని అయిన, లక్ష్మ్యై – లక్ష్మికి, నమోఽస్తు – నమస్కారమగుగాక! దామోదర – ప్రకృతిరూప వైజయంతి ధరించిన హరికి, వల్లభాయై – ప్రియురాలయిన దేవికి, నమోఽస్తు – నమస్కారమగుగాక!

తాత్పర్యం : భృగువంశపుత్రిక, విష్ణు వక్షస్థల నివాస, కమలాలయ హరిప్రియ అయిన లక్ష్మీ దేవికి నమస్కారము.

విశేషములు : 1. భృగు నందిని – భృగునందిన్యై – అనవలసియున్నది. కాని భృగునందనాయై అని ఉన్నది. భృగువే ఆనందకరుడు కాగలడని బహువ్రీహి చేసినచో 'భృగునందనాయై' కాగలదు. లేదా ల్యు ప్రత్యయం చేస్తే 'నందనా' సాధువే.

2. దామ అనగా దండ లేదా త్రాడు. దండ అంటే పంచభూతాత్మకమయిన పంచవర్ణమాలిక వైజయంతి. దానిని తాల్చినవాడు కనుక దామోదరుడు. వర్షానంతరము వచ్చే శరత్తులో వికసించిన ప్రకృతి హరితం దాల్చిన విరాట్టు "దామోదరుడు" అందుకే కార్తికంలో ఆయన దామోదరుడు. కనుక ఈ స్తవం కార్తికంలో కావచ్చును.

3. దామ – త్రాడు. యశోద కట్టిన త్రాడు ఉదరము నందు గలవాడు అని అర్థము.

***

**శ్లో॥ నమో౽స్తు కాంత్యై కమలేక్షణాయై**
**నమో౽స్తు భూత్యై భువనప్రసూత్యై ।**
**నమో౽స్తు దేవాదిభిరర్చితాయై**
**నమో౽స్తు నందాత్మజవల్లభాయై ॥ 16 ॥**

కమలనయనా ! రుచీ ! నమస్కారమమ్మ !
భువనజనయిత్రి ! భూతి ! కైమోడ్పులమ్మ !
దైవతాదిసమర్చితా ! దండమమ్మ !
కృష్ణభామిని ! నీకు ! డింగిళ్ళు తల్లి !

ప్రతిపదార్థం : కాంత్యై – కాంతిరూపురాలు, కమలేక్షణాయై – కమలలోచన అయిన లక్ష్మికి, నమో౽స్తు – నమస్కారమగుగాక! భువనప్రసూత్యై – భువన జనని అయిన, భూత్యై – సంపదకు, నమో౽స్తు – నమస్కారమగు గాక! దేవాదిభిః – దేవ దానవ మానవులచే, అర్చితాయై – పూజింపబడిన దేవికి, నమో౽స్తు – నమస్కారము అగుగాక! నందాత్మజ – నందనందనునకు, వల్లభాయై – ప్రియురాలయిన రుక్మిణీమూర్తికి, నమో౽స్తు – నమస్కారమగుగాక!

తాత్పర్యం : భగవత్సంకల్పరూప, భగవత్కాంతి రూప అయిన కమలాక్షికి నమస్కారము. భువనజనని అయిన ఆ మహాసమృద్ధికి నమస్కారము. దేవదానవాది సమారాధ్యకు నమస్కారము. నందనందనుని వల్లభకు నమస్కారము.

విశేషములు : 1. కాంతి – 'కన' ధాతువునుంచి – అయితే వెలుగు, 'కము' ధాతువు నుంచి అయితే 'కోరిక' సంకల్పము, అని అర్థము.

2. 'భూతి' అనగా 'కావటం' ఉనికి – అని రెండర్థాలు. ఆమె భువనజనని అయిన 'ఉనికి' లేదా భువనమాలగా అయిన శక్తి అని అర్థము. సత్తా; అస్తిత్వం

3. దేవాదిభిరర్చితా – చూడండి "యోగనిద్రా మహానిద్రా వినిద్రా రాక్షసాశ్రితా"

***

**శ్లో॥ సంపత్కరాణి సకలేంద్రియమోహనాని**
**సామ్రాజ్యదాననిరతాని సరోరుహాక్షి! ।**
**త్వద్వందనాని దురితాహరణోద్యతాని**
**మామేవ మాతరనిశం కలయంతు మాన్యే ॥ 17 ॥**



జనని! నీ యొక్క లఖిలాంగ చందనములు
సకల సామ్రాజ్య సౌభాగ్య సాధనములు
జననసాహస్రికాఘనిస్సారణములు
సకలవేళల నాపయి సాగుగాక !

ప్రతిపదార్థం : సరోరుహాక్షి – కమలనేత్రా! మాతః – తల్లీ! సంపత్కరాణి – సంపద కలిగించునవి, సకల – సమస్తమయిన, ఇంద్రియ – ఇంద్రియములకు, మోహనాని – మోహం లేదా సంతోషమును కలిగించునవియు, సామ్రాజ్య – సామ్రాజ్యముల యొక్క దాన – దానమునందు, నిరతాని – ఆసక్తిగలవియు, దురిత – పాపముల యొక్క, ఆహరణ – పూర్తిగా హరించుటయందు, ఉద్యతాని – సన్నద్ధమైనవియు అగు, త్వత్ – నీ యొక్క, వందనాని – స్తోత్రములు, లేదా నమస్కారములు, అనిశం – సదా, మామేవ – నన్నే, కలయంతు – పొందునుగాక! అన్యే – ఇతరములు, మా కలయంతు – పొందకుందుగాక!

తాత్పర్యం : తల్లీ! నీ స్తోత్రములు కాని, నీకు చేసే నమస్కారములుగాని, సంపత్ప్రదాయకములు. సకలేంద్రియచందనములు. సామ్రాజ్యదాన సమర్థములు. పాపనివారకములు. అట్టి వందన పరంపరాసౌభాగ్యము నన్ను ఆశ్రయించుగాక! ఇతరక్రియలు నన్ను చేరకుందుగాక!

విశేషములు : 1. త్వద్వందనాని బదులు త్వదీక్షణాని అని ఒకచోట ఉన్నది. అది అర్థానికి బాగానే ఉన్నది. కాని 'వందనాని' అన్నదే సందర్భశుద్ధిగా ఉన్నది. ఎందుకంటే పైన చెప్పిన 10,11,12,13,14,15 శ్లోకాలలో వరసగా వందనాలు జరిగినవి. నమః నమోౡస్తు అని వరసగా ఉన్నాయి. కనుక అట్టి వందనాధికారము మాత్రమే తనకివ్వాలని కోరటం సబబు.

2. "ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి" అని ఆయనయే సౌందర్యలహరిలో అన్నారుగదా!

3. "వది – అభివాదన స్తుత్యోః" అని ధాతువు. కనుక వందనాని అనగా "ప్రణంతుం, స్తోతుం " రెండూ వస్తాయి. 10వ శ్లోకం కన్న ముందు శ్లోకాలలో 'స్తోతుం' (స్తుతి) అనగా కటాక్షస్తుతి '1' ఉంచి '4'దాకా, 6 నుంచి 9 దాకా జరిగింది. మధ్యలో '5'వ శ్లోకంలో శరీరస్తుతి జరిగినవి.

4. శ్లోకం చివరిపాదంలో చివర మాన్యం, అని నాన్యం అని మాన్యే అని పాఠభేదాలున్నాయి. పైగా 'మామేవ' నన్నే అని పదం వలన "నాన్యం, మాన్యం" అన్నవి సరి అనిపిస్తున్నాయి. కాని అది సందర్భశుద్ధి కాదు. శంకరుని చిత్తశుద్ధి కాదు. ఇతరులకు స్తుతి నమస్కారయోగ్యత

వద్దని ఎలా అంటారు. కనుక వందనాలు తప్ప మిగిలినవి నాకు వద్దనటం న్యాయం. 'ఏవ' అనునది "వందనాని"తో దూరాన్వయం చేయటం మంచిది అయినా అది భక్తులకు సహజ భావనగదా!

***

శ్లో॥ **యత్కటాక్షసముపాసనావిధిః**
**సేవకస్య సకలార్థసంపదః ।**
**సంతనోతి వచనాంగమానసైః**
**త్వాం మురారిహృదయేశ్వరీం భజే ॥ 18 ॥**

వాఙ్మనః కాయ పూర్వక వ్రతుల కొఱకు
నీ కటాక్షార్చనిఖిలార్థ నిధులు గూర్చు
అంబ! శ్రీ విష్ణువక్షస్థ్సలాధివాస !
నిన్ను భజియింతు భక్తి నిర్నిద్రభంగి.

ప్రతిపదార్థం : వచనాంగమానసైః – మనోవాక్కాయములతో, యత్ – ఏ దేవతయొక్క కటాక్ష – అపాంగములయొక్క సముపాసనా – ఉపాసన యొక్క విధిః – చేయుట, సేవకస్య – సేవకునకు, సకల – సమస్తమయిన, అర్థసంపదః – ధనధాన్యాదిసంపదలను, సంతనోతి – పరంపరగా ఇచ్చునో అట్టి, మురారి – విష్ణువుయొక్క హృదయేశ్వరీమ్ – హృదయ వల్లభ అయిన, త్వామ్ – నిన్ను, భజే – సేవింతును.

తాత్పర్యం : త్రికరణ శుద్ధిగా తన కటాక్షములను సేవించిన వానికి ఆ "మురహరప్రియ" సకలధనధాన్యాది సంపదలను కలిగించును.

విశేషములు : 1. "వచనాంగమానసైః" అన్నది 2 సార్లు అన్వయిస్తే వచనోపాసన చేసినవానికి వచన లక్ష్మిని, దేహోపాసన చేసిన వానికి దేహ సౌందర్యలక్ష్మిని ఆరోగ్య లక్ష్మిని, మానసోపాసన చేసినవానికి ప్రతిభాసంపత్తిని కలిగిస్తుందని యథా సంఖ్యాలంకారం వ్యంగ్యం. లేదా త్రికరణ శుద్ధితో కటాక్షసేవ చేసినవానికి త్రికరణ సంపదలను ఇస్తుందని చెప్పవచ్చును.

2. సంతనోతి అనగా 'సంతానంగా' అనగా పరంపరగా ఇస్తుందని అర్థము. వాని వంశములో అందరికి ఇస్తుందని ధ్వని.

3. లక్ష్మీ సహస్ర నామం "సర్వసంపత్తిరూపిణీ", "కారుణ్యాకారసంపత్తిః" అనగా ఆమె రూపం, ఆమె దయా రూపం – రెండూ సంపదలేనట!

***

శ్లో॥ **సరసిజనయనే! సరోజహస్తే!**
**ధవళతమాంశుకగంధమాల్యశోభే !**



**భగవతి! హరివల్లభే! మనోజ్ఞే !**
**త్రిభువనభూతికరి! ప్రసీద! మహ్యమ్ ॥ 19 ॥**

సరసిజకరభూషా! సర్వలోకాదియోషా !
సరసహరిగృహశ్రీ! సర్వసంపత్ప్రద స్త్రీ
సరసిజగృహవాసా ! చారుగంధస్రగాఢ్యా
సరగున గను మమ్మా! సద్దయాదృష్టి నన్నున్.

ప్రతిపదార్థం : సరసిజనయనే! – పద్మనేత్రా! సరోజహస్తే! – పద్మహస్తా! ధవళతమ – మిక్కిలి తెల్లని, అంశుక – వస్త్రములు, గంధ – చందనము, మాల్య – పుష్పమాలికల యొక్క, శోభే! – శోభగలదానా! భగవతి! – షడ్విధైశ్వర్యములుగలదానా! హరివల్లభే! – హరిప్రియా! మనోజ్ఞే! – మనోహరీ! త్రిభువన – ముల్లోకములకు, భూతికరి! – సమృద్ధి గలిగించినదానా! మహ్యమ్ – నాకు, ప్రసీద – అనుగ్రహింపుము. ప్రసన్నురాలవుకమ్ము.

తాత్పర్యం : కమలనేత్రా! కమలధారిణీ! పరిశుభ్రగంధమాల్యవిలాసినీ! మనోహరీ! త్రిలోకసంపత్కారిణీ! హరివల్లభా! భగవతీ! నాకు ప్రసన్నురాలవుకమ్ము.

విశేషములు : 1. ధవళతర అని ఒక పాఠం ఉన్నది. కాని "ధవళతమ"అన్నదే మంచిది.

2. ధవళ అనగా "తెల్లని" అని అర్థము. కాని 'శుభ్రమయిన' మురికిలేని అనిగూడా చెప్పవచ్చును.

3. సదదృష్టప్రదాయిని అయిన ఈమెరూపం ఎక్కడయినా ఉజ్జ్వలంగా ఐశ్వర్యపూర్ణంగానే వర్ణింపబడినది. అలాగే ధ్యానించాలి. "జఘన్యాకృతి వర్జితా" అన్నది లక్ష్మీసహస్రనామం. తుచ్ఛమయిన హీనమయిన ఆకారం లేదట. అందుకే "హిరణ్యవర్ణ, హిరణ్యరజతస్రజ, హిరణ్మయి".

***

శ్లో॥ **దిగ్దంతిభిః కనకకుంభముఖావసృష్ట–**
**స్వర్వాహినీవిమలచారుజలప్లుతాంగీమ్ ।**
**ప్రాతర్నమామి జగతాం జననీమశేష–**
**లోకాధినాథగృహిణీమమృతాబ్ధిపుత్రీమ్ ॥ 20 ॥**

కనక కుంభావభాసి దిగ్దంతి సృష్ట
విమలమందాకినీ వారి విహితసేక
అమృతసింధుతనూజాత నఖిలలోక
పాల వల్లభ నేనుషోవేళ గొలుతు.

ప్రతిపదార్థం : దిగ్దంతిభిః – దిగ్గజములచేత, కనకకుంభ – బంగారుకలశములయొక్క, ముఖ – ముఖములచేత, అవసృష్ట – విడువబడిన, స్వర్వాహినీ – మందాకినీ నదియొక్క, విమల – నిర్మలమయిన, చారు – సుందరమయిన, జల – నీటిచేత, ప్లుత – తడుపబడిన, అంగీమ్ – శరీరముగలదియు, అశేష – సమస్తమయిన, లోక – లోకములకు, అధినాథ – నాయకుడైన విష్ణుభగవానుని, గృహిణీమ్ – గృహపత్ని అయినదియు, అమృతాబ్ధి – క్షీరసముద్రమునకు, పుత్రీమ్ – పుత్రికయు అయిన, జగతాం జననీమ్ – ఆ జగజ్జనని అయిన లక్ష్మిని, ప్రాతః – ప్రొద్దున, స్మరామి – స్మరించుచున్నాను, స్మరించెదను.

తాత్పర్యం : దిగ్గజములునాల్గు తమ తొండములచే బంగారు కలశములు పట్టికొని తెచ్చిన అమరగంగా నదీ జలములతో చేసిన అభిషేకముతో తడిసియున్నది లక్ష్మీదేవి. సమస్త లోకనాయకుడైన విష్ణుదేవుని గృహిణి, అమృత సాగర పుత్రిక విశేషించి ఆమె జగజ్జనని – అట్టి ఆమెకు ప్రాతః కాలమునందు నమస్కరించుదును.

విశేషములు : 1. దిగ్హస్తిభిః – అని ఒక పాఠం. అది శ్రవణ మధురం కాదు.

2. కనక కుంభముఖ – వద్ద సహజార్థం ఇది. కనకాలంకార శోభితమయిన కుంభస్థలముల ముఖములనుండి అనగా తొండములనుండి – అని చెప్పవచ్చును. లేదా కనక అనగా సిందూరం వలన ఎర్రబడి కనక వర్ణం గా ఉన్న అని చెప్పవచ్చును. కుంభం అంటే కుంభస్థలం.

3. ప్రాతఃకాలం అనటానికి మరో సూచన దేవియొక్క ఉషఃస్నానము.

4. దిగంత సామ్రాజ్యలక్ష్మీ పట్టాభిషేకం దీనిలో కనబడుతున్నది.

5. ఈ విషయం శ్రీసూక్తం మొదలగువానిలోనిదే. చూడండి.

"లక్ష్మీః దివ్యైః గజేంద్రైః మణిగణఖచితైః స్నాపితా హేమకుంభైః" "పద్మే పద్మాలయే పద్మే పూర్ణకుంభాభిషేచితే " లక్ష్మీసహస్రనామాలు

6. జలప్లుతాంగీం – ఈ పదంతో ఆమె, 'ఆర్ద్ర' అన్న శ్రీసూక్తాది విషయమును సూచించడం జరిగింది.

1. ఆర్ద్రాం యః కరిణీం యష్టిం 2. హిరణ్యప్రాకారామార్ద్రాం

3. ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం

***

శ్లో॥ **కమలే! కమలాక్షవల్లభే! త్వం**
**కరుణాపూరతరంగితైరపాంగైః ।**



**అవలోకయ మామకించనానాం**
**ప్రథమం, పాత్రమకృత్రిమం దయాయాః ॥ 21 ॥**

కమలాలయ, కమలేక్షణ,
కమనీయకళాకలాప, కరుణాభరణా!
కమలాంబ! నన్నుకించను
గమనింపుము నింపుమమ్మ ! కల్యాణములన్

ప్రతిపదార్థం : కమలే! – లక్ష్మీ! కమలాక్ష – విష్ణువునకు, వల్లభే! – ప్రియమయినదానా!, త్వమ్ – నీవు, కరుణాపూర – దయాప్రవాహము చేత, తరంగితైః – అలలువేసే, అపాంగైః – కడగంటి చూపులతో, అకించనానామ్ – దరిద్రులలో (సన్యాసులలో) ప్రథమమ్ – మొదటివాడను, దయాయాః – నీ దయకు, అకృత్రిమమ్ – సహజమయిన, పాత్రమ్ – అర్హుడను అగు, మామ్ – నన్ను, అవలోకయ – చూడుము.

తాత్పర్యం : హరిప్రియా! హరిణీ! దయాతరంగములయిన నీ అపాంగములతో నన్ను అనుగ్రహింపుము. నేను ఏమిలేనివారిలో మొట్టమొదటివాడను. నీదయకు సహజపాత్రుడను.

విశేషములు : 1. అకించనుడు –సన్న్యాసి, బ్రహ్మచారి, "నేహనానాస్తి కించన" – అనేవారు.

2. దయకు సహజపాత్రం – అంటే పుట్టు దరిద్రుడు. తను బుద్ధిపూర్వకంగా చేసిన వృత్తిదోషాల వలన ధనం పోలేదు – అని భావము.

***

శ్లో॥ **బిల్వాటవీమధ్యలసత్సరో జే**
**సహస్రపత్రే సుఖసన్నివిష్టామ్ ।**
**అష్టాపదాంభోరుహపాణిపద్మామ్**
**సువర్ణవర్ణాం ప్రణమామి లక్ష్మీమ్ ॥ 22 ॥**

శ్రీఫలద్రుమవనములో చెరువులోన
వేయిరేకులతమ్మిలో వెలుగుదాన !
పమిడితమ్ముల పాణిపద్మములదాన,
పసిడిపచ్చని శ్రీతల్లి! ప్రణతులమ్మ

ప్రతిపదార్థం : బిల్వాటవీ । మారేడు చెట్ల వనము యొక్క, మధ్య – మధ్యభాగమున, లసత్ – మెరయుచున్న, సరః – సరస్సులో, జే – పుట్టిన, సహస్రపత్రే – వేయిరేకుల పద్మములో, సుఖ – సుఖముగా, సన్నివిష్టామ్ – ఆసీనురాలును, అష్టాపద – బంగారు వయిన, అంభోరుహ – పద్మములుగల, పాణిపద్మామ్ – కరపద్మములు గలదియు, సువర్ణవర్ణామ్ –బంగారు రంగుగలదియు, అగు, లక్ష్మీమ్ – లక్ష్మిని, ప్రణమామి – నమస్కరించుచున్నాను.

తాత్పర్యం : మారేడు తోటలో నున్న పెద్ద సరస్సులో వేయిరేకుల కమలములో నున్నదియు, హస్తపద్మములలో బంగారు పద్మములు ధరించినదియు అగు హిరణ్యవర్ణ అయిన లక్ష్మికి నమస్కరించెదను.

విశేషములు : 1. బిల్వం మహాలక్ష్మికి ప్రీతికరం చూడండి శ్రీసూక్తం "ఆదిత్యవర్ణే తపసోధి జాతో వనస్పతిః తవ వృక్షోధ బిల్వః తస్య ఫలాని తపసా నుదంతు మాయాంత రాయాశ్చ బాహ్యా అలక్ష్మీః - అనగా తపస్సునుండి పుట్టిన కర్మవృక్షమే యీ బిల్వ వనస్పతి. దీని ఫలములు మాలోని, మా వెలుపలి "దరిద్రదేవతలను తొలగించుగాక" - అని అర్థం.

వామనపురాణంలో "కాత్యాయన్యాః శమీ జాతా బిల్వో లక్ష్మ్యాః కరోభవేత్" అని బిల్వం లక్ష్మీకిరణమని ఉన్నది. బిల్వపత్రం ఉమ్మెత్త - లక్ష్మి పూజకు శ్రేష్ఠమని చెప్పబడినది. "ఐశ్వర్యేణార్చయేద్దేవీం బిల్వపత్రైః హరిద్రయా" (ఐశ్వర్యం అంటే - ఉమ్మెత్తపువ్వు)

***

శ్లో॥ **కమలాసనపాణినా లలాటే**
**లిఖితామక్షరపంక్తిమస్య జంతోః ।**
**పరిమార్జయ మాతరంఘ్రిణా తే**
**ధనికద్వారనివాసదుఃఖదోగ్ధ్రీమ్ ॥ 23 ॥**

కలిమిగల పంచ, పడిగాపుగాయుమనుచు
ధాత వీనిమొగంబున వ్రాతవ్రాసె
అతిలలాటంతపంబైన అజునిచేతి
వ్రాత తుడుపవె నీ కాలిరాతతోడ.

ప్రతిపదార్థం : మాతః - తల్లీ! అస్య - ఈ, జంతోః - జీవునియొక్క/ప్రాణియొక్క, లలాటే - మొగమునందు, కమలాసన - బ్రహ్మయొక్క, పాణినా - చేతిచేత, లిఖితాం - వ్రాయబడినదియు, ధనిక - ధనికుల యొక్క, ద్వార - ద్వారమువద్ద, నివాస - నివసించుట అనే, దుఃఖ - దుఃఖమునకు, దోగ్ధ్రీమ్ - సమకూర్చునదియు అయిన, అక్షరపంక్తిమ్ - వర్ణపంక్తిని, తే - నీ యొక్క, అంఘ్రిణా - పాదముతో, పరిమార్జయ - తుడిచిపెట్టుము.

తాత్పర్యం : ధనికద్వారాల దగ్గర ధనంకోసం పడిగాపులు పడమని యీ జీవుని మొగమున బ్రహ్మవ్రాసిన వ్రాతను - తల్లీ - నీ కాలితో తుడిచివేయుము.

విశేషములు : 1. బ్రహ్మచేతికి దేవి పాదం సమాధానమని చెప్పటం - దేవీ సామర్థ్యమును ధ్వనించుచున్నది.

2. "దారిద్ర్యధ్వంసినీ దేవీ", "గృహచ్ఛిద్రనివారిణీ", "అలక్ష్మీర్మేనశ్యతాం! త్వాం! వృణే",



"అభూతిమసమృద్ధించ సర్వాన్నిర్ణుద మే గృహాత్" అన్న లక్ష్మీ సహస్రనామ, శ్రీసూక్తములలో నిర్దేశించిన విషయమే ఇది.

***

శ్లో॥ **అంభోరుహం జన్మగృహం భవత్యాః**
**వక్షఃస్థలం భర్తృగృహం మురారేః ।**
**కారుణ్యతః కల్పయ పద్మవాసే!**
**లీలాగృహం మే హృదయారవిందమ్ ॥ 24 ॥**

ముగ్ధకమలంబు తల్లి! నీ పుట్టినిల్లు
మేఘనీలుని గుండె నీ మెట్టినిల్లు
కమలగేహిని! నా చిత్త కమలమిదిగొ
ఆదరింపుము లీలాగృహంబుగాను.

ప్రతిపదార్థం : పద్మవాసే - పద్మనివాసినీ! భవత్యాః - నీకు, అంభోరుహమ్ - పద్మము, జన్మగృహమ్ - పుట్టిల్లు, మురారేః - మురహరునియొక్క, వక్షస్థ్సలమ్ - ఱొమ్ము, భర్తృగృహం - మెట్టినిల్లు, మే - నా, హృదయారవిందమ్ - చిత్తకమలమును, లీలా గృహమ్ - విలాసగృహముగా, కారుణ్యతః - దయవలన, కల్పయ - కల్పింపుము.

తాత్పర్యం : తల్లీ! ఒక కమలము నీకు పుట్టినిల్లు. శ్రీహరి వక్షస్థ్సల కమలము నీకు మెట్టినిల్లు. కనుక తల్లీ! నీవు నీ విలాసగృహంగా నా హృదయకమలాన్ని దయతో స్వీకరించుము.

***

శ్లో॥ **స్తువంతి యే స్తుతిభిరమూభిరన్వహం**
**త్రయీమయీం త్రిభువనమాతరం రమామ్ ।**
**గుణాధికా గురుతరభాగ్యభాజినో**
**భవంతి తే భువి బుధభావితాశయాః ॥ 25 ॥**

సత్త్రయీమూర్తి త్రిభువనజనని లక్ష్మి
నీ స్తుతులచేత గొనియాడు శస్త గుణుడు
పరమసౌభాగ్య గరిమ నపార భద్ర
సంతతిని గొంచు బుధగణాశాస్యుడగును.

ప్రతిపదార్థం : యే - ఎవరు, అమూభిః - ఈ, స్తుతిభిః - స్తోత్రములచేత, త్రయీ మయీమ్ - వేదరూపయు, త్రిభువన - ముల్లోకములకు, మాతరమ్ - మాత అయిన, రమామ్ - లక్ష్మిని, అన్వహమ్ - ప్రతిరోజు, స్తువంతి - స్తుతించెదరో, తే - ఆ,

గుణాధికాః – గుణోత్తములు, భువి – భూమియందు, గురుతర – మిక్కిలిగొప్పవయిన, భాగ్య – భాగ్యములను, భాజినః – పొందువారుగను, బుధ – పండితులచేత, భావిత – భావనచేయబడిన, ఆశయాః – భావముగల వారున్ను, భవంతి – అగుదురు.

తాత్పర్యం : వేదమాత జగజ్జనని అయిన రమాదేవిని యీ స్తుతులచేత నిత్యమూ గౌరవించు గుణవంతులు గొప్ప భాగ్యవంతులుగను, సారస్వత జన గౌరవపాత్రులుగను అగుదురు.

విశేషములు : 1. అసలు ఫలశ్రుతి ఇదే. తరువాత శ్లోకం ప్రక్షిప్తం అయి ఉండవచ్చును. అందుకే కొన్ని ప్రతులలో లేదు.

***

ఫలశ్రుతి

**శ్లో॥ సువర్ణధారాస్తోత్రం యత్ శంకరాచార్యనిర్మితమ్ ।**
**త్రిసంధ్యం యః పఠేన్నిత్యం స కుబేరసమో భవేత్ ॥**

సువర్ణధారా స్తవమున్
శంకరాచార్యశైలిలో
ముప్పూటల పఠింపంగా
కుబేరసముడే యగున్.

ప్రతిపదార్థం : శంకరాచార్య – శంకరాచార్యులచేత, నిర్మితమ్ – రచితమయిన, సువర్ణధారాస్తోత్రమ్ – కనకధారాస్తుతి, యత్ – ఏదిగలదో, తత్ – దానిని, యః – ఎవడు, నిత్యమ్ – ప్రతిరోజూ, త్రిసంధ్యమ్ – ముప్పూటలా, పఠేత్ – చదువునో, సః – వాడు, కుబేరసమః – కుబేరసమానధనవంతుడు, భవేత్ – అగును.

తాత్పర్యం : శంకరాచార్య రచితమయిన యీ కనకధారా స్తోత్రమును (మంచి అక్షరధారగలస్తోత్రం) నిత్యము మూడు పూటలా చదువు వాడు కుబేరసమానుడైన ధనికుడగును.

ఇది శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శంకరాచార్య ప్రణీతమయిన కనకధారాస్తవము. సంపూర్ణము.

**'జాతవేదా' వ్యాఖ్య సమాప్తము.**

శ్రీః



డా॥ నడిపినేని సూర్యనారాయణ, కోటేశ్వరమ్మ గార్ల ఆర్థిక సహాయముతో ముద్రింపబడిన ఈ వ్యాఖ్యాన గ్రంథము ఆదిశంకరాచార్యుల వారి పాదపద్మములకు భక్తితో సమర్పితము. చక్కని పీఠిక అనువాదము లతోబాటు ఈ స్తోత్రమునకు 'జాతవేదా' అను నామముతో ప్రతిపదార్థ – తాత్పర్య – విపులవివరణలను అందజేసిన శ్రీ మేళ్లచెర్వు వార్కి నమస్సులు.

**ఇయ్యది ఉపాసకులకు సాధనమగుగాక.**

**– రామోరా.**